ఓమ్

శ్రీమత్పరదేవతాయైనమః.

# శ్రీ దుర్గాగణపేశ్వర శతకం.



జ్యోస్యుల సూర్యనారాయణశాస్త్రి,
కోఆపరేటివ్ సూపర్వైజర్.

ఓమ్.

శ్రీమత్పరదేవతాయైనమః.

# శ్రీ దుర్గాగణపేశ్వరశతకం.

గ్రంథకర్త,


జ్యోస్యుల సూర్యనారాయణశాస్త్రి.

కోఆపరేటివ్ సూపర్వైజర్.



1935

మొదటికూర్పు 1000 ప్రతులు

శ్రీగౌరీముద్రాక్షరశాల, నూజవీడు.




[వెల 4 అణాలు.

# కృతజ్ఞత.



అధికారమున గ్రామాధికారియును; సహకారంబున; సహకారపరపతిసంఘాధ్యక్షుఁడును; న్యాయపరిపాలనమున, పంచాయతీ సభాధ్యక్షుఁడును; సమస్తభూతములయెడ నత్యంతకరుణార్ద్రహృదయుఁడును; భాషాభిమానియును; నూజవీడు తాలూకా పోతురెడ్డిపల్లి వాస్తవ్యులునగు; శ్రీయుత చలసాని వెంకట్రామాంజనేయ చౌదరిగారు, నాయీశతకమునచ్చొత్తించుటకగు ధనసహాయమొసంగి నన్నుఁ బ్రోత్సహించుటచే వారికెంతయుఁ గృతజ్ఞుఁడనై శ్రీదుర్గాగణపేశ్వరుఁడు వారి కుటుంబమున కత్యంత సౌభాగ్య దీర్ఘాయురారోగ్యములనిడి పాలించుఁ గాత! యని, యాశీర్వదించుచున్నాను.

యువసం॥ చైత్ర శుద్ధ
నవమి శుక్రవారం
నూజవీడు,
**12—4—35.**

ఇట్లు
బుధజన విధేయుఁడు,
**జ్యో. సూ. శాస్త్రి.**
గ్రంథకర్త.




శ్రీమత్పరదేవతాయైనమః.

# శ్రీ దుర్గాగణపేశ్వరశతకం.





పరమాత్మా! నినునేఁ దెవేఱఁ దలం ♦ పం బూని యున్నాఁడనీ
వటు కెన్నఁ డిటువంటియూహ జనియిం ♦ పన్ బోనియజ్ఞానము
న్హరియింపంగదవయ్య! నాదోసఁగులా ♦ ద్యంతంబునిన్ గొల్తు
నో। హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా!
శంకరా! 1

మ. సరసంబౌ మకుటంబుఁ గూర్చెదను నీ ♦ సాయుజ్యముం జేర్ప సు
స్థిరసాంగత్యము నాకుఁ గూర్చు కవియా ♦ శ్రీసత్యనారాయణుం
డెరవై దోఁచెను లేనిచో నిటుల నే ♦ నింకన్ విచారింతునో
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 2

మ. సిరిసంపత్తుల కాంధ్రదేశమున వా ♦ సింజెందుఁ గృష్ణాతటిం
గర మొప్పన్ గణపేశ్వరంబచట ము ♦ ఖంబార్చ్యుదైవంబవై
దరహాసంబునఁ గొల్వఁ దీర్చితివి సం ♦ దర్శింప భక్తాళి, యో
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 3

మ. గురువున్ బేర్కొనకుంటినంచు మదిలోఁ ♦ గొంత శంకించివేఁ
దుఱుఁజెందంగఁ బనేమి? నీశతకముం ♦ దున్ దైవతంబన్న నా
గురువన్నన్ దలిదండ్రివన్నఁ దగు నీ ♦ కున్ గొంకఁగానేల? యో
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 4

మ. సరసాంతఃకరుణావిశేషమున నీ ♦ సాన్నిధ్యమున్ జేరి నే
వరముల్ గోరఁగఁదన్కు వౌన? ధరఁబా ♦ పఘ్నుండవీవేకదా!
కరుణింపందగునిప్పుడైన మదిలోఁ ♦ గారుణ్యమున్ జూపి, యో
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 5

మ. గిరియాముంటివటంచు నెంచితిని నేఁ ♦ గించజ్ఞుఁడన్ గాననేఁ
డరయన్ మానవకోటులెల్ల నినుఁగ ♦ న్నారంగ సేవింపఁగా
ధరకే తెంచితివయ్య! భక్తులకు బా ♦ ఫల్ మాన్పి రక్షింపఁగా
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 6

మ. చిరకాలంబుననుండియున్ మనసు నీ ♦ సేవన్ గనంజాలకే
చరణంబుల్ లిఖియింపకుంటి నదియే ♦ సాక్ష్యంబుగాకున్న నీ
వరయంజాలవ! నన్ను, బుద్ధియిపుడ ♦ త్యంతంబు నీపై నినే
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 7

మ. ఎటుఁగన్, జేసితిఁ బాపకార్యములనే ♦ నెంచంగ లేనైతిఁ బా
మరుఁడన్, భవ్యపదాబ్జయుగ్మమునుప ♦ ల్మారున్ మదిన్నిల్పియా
తురతన్ గొల్చెదనన్నుఁ బ్రోవుమిఁకనా ♦ దోసంబులన్ బాపి, యో
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 8

మ. అరయన్ భీకరమైనయట్టిదగు నీ ♦ యర్ధాంగినా దుర్గనె
వ్వరు దర్శింపఁగలేమి మాంత్రికుఁడునౌ ♦ పాంథుండొకండప్డు, నీ
తరుణీ భీకరదృష్టివంచెనటగా ♦ దా! చిత్రమైతోఁ చెడున్
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 9

మ. అరవిందమ్ములఁగొంచు దేవతలు ని ♦ త్యంబున్ భవత్సేవకై
పరమానందముతోడ తేపకడనే ♦ భవ్యంబుగాఁ బూజఁజే
సిరికాదా! సురపాదచిహ్నములనే ♦ జెప్పంగ నేవిందురా
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ! ♦ హారా! శివా! శంకరా! 10

మ. కరులన్ గోఁగరంపువాజులను నేఁ ♦ గాంక్షింపఁగాఁబోను సుం
దరహార్మ్యంబుల భోగభాగ్యముల సం ♦ స్థానంబు లేనొల్ల, నీ
చరణాబ్జంబు లెనమ్మినాఁడ నిఁక నా ♦ సల్ వీడి సద్భక్తితో
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హరా! శివా! శంకరా! 11

మ. పరకాంతా ధనకాంక్షచిత్తమున నేఁ ♦ బల్మారు మోహంబునన్
నరుఁ డజ్ఞానముచేతఁ గ్రుంగు భువిలో ♦ నన్, నాకుఁ దద్భావసం
కరతన్ వీడి నజ్ఞానమిచ్చుటకు నీ ♦ కాల్బట్టెదన్ రాగదే
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హరా! శివా! శంకరా! 12

మ. పరమార్థంబునకై మహామహులు సం ♦ పాదించి వెచ్చింతురీ
వఱకెందైనను పుణ్యకార్యములనీ ♦ ప్రాకారకల్యాణ మం
దిరనిర్మాణము లెన్నసాక్ష్యములగు ♦ న్నిక్కంబుగా నెంచినన్,
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హరా! శివా! శంకరా! 13

మ. గరళం బార్భటిఁ బుట్ట ముజ్జగములన్ ♦ గాపాడఁగా మ్రింగి, నీ
శిరమందున్ ధరియించియుంటివిగదా! ♦ శీతాంశునిన్ గంగనున్
దరమా! యేరికినట్లు సల్ప జగదా ♦ ధారుండవీవౌదువో
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హరా! శివా! శంకరా! 14

మ. తిరుగం జాలను దేశదేశములు నే ♦ తీర్థంబులన్ గ్రుంకఁగా
నరుగం జాలను యాత్రలన్ గడఁప ని ♦ త్యానందమున్ జెంది నీ
పరమార్థంబగు తత్త్వబోధనలు సం ♦ ప్రాప్తించినన్ జాలునో
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హరా! శివా! శంకరా! 15

మ. నిరతానందసుఖంబులన్ గనియునున్ ♦ నిన్ గోరి పూజింపఁగాఁ
గఱవౌనా! పరమార్థముల్ జగతిలోఁ ♦ గర్మంబదెట్లుండునో?
యెఱుఁగంజాలను నీదుశక్తి యనఘా! ♦ యేమందునన్ బ్రోవుమా!
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హరా! శివా! శంకరా! 16

మ. పరమేశా! నినుఁగూర్చి కాదె! సురలున్ ♦ బ్రహ్మాదులుప్పొంగ నీ
చరణంబుల్ గని పూజసల్పిరని యున్ ♦ సాయుజ్యమున్ గోర, భా
సురమౌ సద్గతిఁ జూపియుంటివని యున్ ♦ సూచించు నీగాథలో
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 17

మ. ధరణిన్ దాతల పేరువిన్న నలబీ ♦ దల్ పోవుదుర్ వేఁడఁగా
శరణంబంచు వచింప? రాజనులు నీ ♦ సాన్నిధ్యముం గోరి త
త్సరిణిన్ జేతిగూచకుండనయి దో ♦ సంబున్న సైరింపుమో
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 18

మ. పురుషార్థంబులఁ గోరియుంటినను సం ♦ పూర్ణంబుగాఁ జేరిన నీ
పరమార్థంబెటుపోవు? ముఖ్యముగ నా ♦ ప్రారబ్ధమే మూలమై
చరితార్థంబగునంచు నెంచెదను సు ♦ జ్ఞానంబు చేకూర్చవే
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 19

మ. పగిపాలింతువటంచు నమ్మికొని నా ♦ బాంధవ్యమున్ నేను, నీ
కెటులన్ జేయుచునుంటి, సాహసమున ♦ స్నేలాగు బలింపించెనో
వరదా! దుర్గను బుట్టినిల్లగుదు నా ♦ పల్లెన్ వివర్ణించదన్
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 20

మ. మునువన్ 'దల్లషదీవి' కాఁ పురముగా ♦ మా తాతముత్తాతలా
పురమందుండిరి పెద్దకాలము; భువిన్ ♦ బుణ్యాత్ములైరన్న న
బ్బురమా! నీదగు దేవియే వెలయఁగాఁ ♦ బూజించి సేవించరా?
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 21

మ. చిరకీర్తిన్ గడియించి యొప్పిర వనిన్ ♦ శ్రీమంతులందందు గో
పుర దేవాలయమంటపంబులను నే ♦ ర్పున్ మీఱ నిర్మించి, నా
తరమా! నేనటువంటి భాగ్యముల నం ♦ దన్ నిన్ను సేవింపఁగా
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 22

మ. అరయన్ మున్ను ప్రతాపరుద్రనృపుఁడే ♦ యై యుండఁగా నోపు సా
గరతీరాఁ బ్రతిష్ఠలన్ నెఱపి ప్ర ♦ ఖ్యాతిన్ భువిన్ జెందెనం
చురుచారిత్రవివేకయుక్తు లనఁగా ♦ నూహించియిట్లుంటినో
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 23

మ. సురనిర్మాణమొ! రాజకార్యవిధమో! ♦ చూడంగ నీయాలయం
బెఱుఁగన్ రాదు ముదంబుఁ గూర్చెవిసఁగా ♦ నేమందు? నాధారముల్
కలవై పోయెను శాసనంబులనఁజ ♦ క్కన్ రావు యోజింపఁగా
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 24

మ. పరిహాసంబున వేఁడుచుంటినని నీ ♦ భావంబునం దెంచకే
దరహాసంబున బ్రోవుమయ్య! కృపతో ♦ దార్ఢ్యంబు నీకుంటచేఁ
బరులన్ గొల్వక మాటిమాటికిని నీ ♦ పాదంబులన్ బట్టితిన్
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 25

మ. ధరసంసార సుఖాంధకారమయు సం ♦ తాపక్రియాలోలతన్
బరమార్థానుభవాంచితక్రియల సం ♦ పాదింపఁగాలేమి, మ
ద్దురితాంతంబు నితాంతమున్ గనఁగఁజే ♦ తుల్ మోడ్తు సద్భక్తితో
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 26

మ. హరినామస్మరణంబు నీదు పదపూ ♦ జానందసౌభాగ్యమున్
దరణోపాయములంచుఁ బల్కెదరు పె ♦ ద్దల్ జ్ఞానమార్గంబునన్
బరమాత్ముండవు నీవె గాఁదలఁచి నే ♦ భావించెదన్ ముక్తికై
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 27

మ. జరిగెన్ని ర్వదియెన్మిదేఁడులు యథే ♦ చ్ఛావృత్తి నేనుంటచే
భరమై తోఁచెను నేఁటికీభవము సం ♦ భావింప సంసారమే
చెఱసాలై కనుపట్టె నేలుకొన నిన్ ♦ సేవింతు నిక్కంబుగా,
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 28

మ. వరపూజ్యుండు మృకండుసూతి యెదనీ ♦ పాదాంబుజాతమ్ములన్
స్థిరబుద్ధిన్నిలుపంగఁ బ్రోచితివ, యా ♦ శీర్వాదమున్ జేసి సు
స్థిరుఁడై యుండఁగ నట్లకాతువనినేఁ ♦ జిత్తమ్మునన్ సమ్మతిన్
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 29

మ. కొఱతల్ గల్గవు భక్తసంతతికి భు ♦ క్తుల్ ముక్తులుంగల్గెడిం
బరమార్థంబు లభించెడిన్ బయిని బ్ర ♦ హ్మజ్ఞానముంగల్గునీ
చరణంబుల్ గనినన్ భజించినను ని ♦ ష్ఠా పాటవంబొప్పఁగా
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 30

మ. అఱకన్ యెద్దులఁ గట్టికష్టపడి ని ♦ త్యంబుల్ సుఖంబెంచకే
ధరణిన్ దున్ని ఫలింపఁజేయు నరుఁడే ♦ తధ్యంబుగా రైతు, పెన్
గఱవున్ బాపెడు ధర్మకార్యపరుఁడీ ♦ కాలంబునన్ గానఁగా
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 31

మ. ఎరువున్ దోలి బలంబుఁజేయుచునుఁ దా ♦ నెంతేనిలాభంబుకై
యిరిణప్రాంతములందుఁ గష్టపడు రై ♦ తే సత్ఫలంబందుఁ ద
త్సరణిన్ మోక్షపదంబుఁగాంచుటకు నీ ♦ దాసుండనై కొల్చెదన్
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 32

మ. చెఱకున్నాటినలబ్ధివచ్చునని వే ♦ పెన్ రైతు చేనంతయున్
గఱవై పోయెను వర్షధార భువిలోఁ ♦ గర్మానుసారంబుగాఁ
జరియించున్ మది యోగమున్న యెడ వీ ♦ సంబైనలోటుండునా?
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 33

మ. పరికింపన్ గడు చిత్రమయ్య! యొటునిన్ ♦ భక్తుండుదాఁ జేరునో
యెఱుఁగన్ జాల భుజంగభూషణుఁడవై ♦ యెంతేనిభూతిన్ మెయిన్
ధరియింపన్, నిరతంబునీదుకడనే ♦ దాసుండనై యుండెదన్
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 34

మ. వరభళ్ళాణ నృపాలకుండు మునినీ ♦ పాదంబులంగొల్చియే
చిరకీర్తిన్ గణియించి భక్తవరుఁడై ♦ శ్రేయంబులంగాంచె, బా
పురె! యెన్నందగు నట్టిజీవితము సం ♦ బోధింపఁగాఁ జెల్లదా?
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 35

మ. అరయన్నాతరమా! యథావిధిగ సం ♦ ధ్యావందనాదిక్రియల్
జరుపన్ వేళకు నిష్ఠలన్ గలిగి స ♦ త్సాంగత్య శాస్త్రోచితా
చరణుండై చరియించుభక్తనరు మె ♦ చ్చన్ జూతు వెక్కాలముల్
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 36

మ. నిరతాన్నంబిడి ధర్మకార్యములనే ♦ నిత్యంబునుంజేయుచున్
ధరణిన్ బెక్కురు నీపదాంబుజములన్ ♦ దథ్యంబుగాఁగొల్చినన్
గరుణన్ జూపవు వారికర్మఫలమా? ♦ గాకున్న నీయిష్టమా?
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 37

మ. కరుణాసింధుఁడవీవెగా జగతిసా ♦ కన్ జూతువీ విశ్వమున్
శరణార్థిన్ గృపఁజూచియేలుకొనుమా ♦ సంపూర్ణరాగంబునన్
అరిషడ్వర్గములన్ జయించుటకునే ♦ నత్యంతమున్ గొల్తునిన్
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 38

మ. అరవిందాసన సృష్టిచిత్రమయమో ♦ హావేశసంబద్ధ భా
సుర పుష్పావళి బాణవృష్టి కృతహా ♦ సున్ సుందరాకారునిన్
దురదృష్టాన్వితు నాయనంగునటు ద ♦ గ్ధుంజేసితో వింతగా
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 39

మ. నరజన్మంబు లభించినందులకుఁ బు ♦ ణ్యంబొప్పఁగా నీపదం
బరయంగావలెఁగాని భోగములయం ♦ దత్యంతరాగంబునన్
జరియింపన్ ఫలమేమి? భావిదశకై ♦ సంప్రీతితోఁ గొల్తునిన్
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 40

మ. తరుణంబుల్ గని నాపితామహులు సం ♦ స్థానంబులన్ దిర్గమున్
బిరుదుల్ మేల్ బహుమానముల్ గనిరి, సం♦ప్రీతాత్ములై నిత్యమున్
శరణంబంచు భవత్పదాంబుజములన్ ♦ నమ్మంగనట్లయ్యెనో
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 41

మ. అరయన్ గార్తిక మాసమందునినుఁ గ ♦ న్నారంగ సేవించినన్
బరమార్థంబు లభించునందురిల నా ♦ పద్బంధువీవాటచేఁ
గరుణన్ జూడఁగదయ్య! లేనియెడలన్ ♦ గష్టంబుగాఁదోఁచదా?
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 42

మ. వరకాశీపురమందునన్ సకల సౌ ♦ భాగ్యంబులేవేళలన్
దొరకున్ గావున నేను పూజ్యుఁడవుగా ♦ దుర్గాసమేతుండవై
దరహాసంబునఁ గొల్వుదీర్చితివి బా ♦ ధల్ మాన్పి రక్షింపఁగా
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 43

మ. పొరపాటన్న మనుష్యమాత్రులకు ము ♦ న్నెందెందులం గల్గఁగా
సరియంజాలరు కార్యమైనపిదపన్ ♦ హా! యంచు నిశ్చేష్టతన్
వెరఁగుంజెందెద రీప్రపంచమున నీ ♦ విజ్ఞానమే లేనిచో
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 44

మ. పరధర్మంబుల నాచరించుటలు సం ♦ పర్కంబునం గల్గునం
చురువిజ్ఞానులుఁ బల్కుచుండెదరు శా ♦ మూహింపఁగా ధర్మముల్
పరివర్జించి యథేచ్ఛగాఁజనినఁ బా ♦ పంబుప్పతిల్లున్ గదా!
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 45

మ. హరియంచున్ హరుడంచుఁ గ్రైస్తువనుచ♦ల్లాయంచు బల్ రీతులన్
ధరణిన్ బెక్కురు పూజసల్పుదురిఁ కే ♦ దారిన్ గనంజాలకే
నొరులన్ గొల్వక నీపదాంబుజముల ♦ న్నూహించి నేఁబట్టితిన్
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 46

మ. వరదా! శ్రీదళముల్ గ్రహించినిను సం ♦ భావింపఁగా నెంచి సు
స్థిరభక్తిం బ్రతికార్తికంబున ధరా ♦ దేవుల్ నినుంబూజలన్
నెఱపన్ జూచెదరయ్య! నాతరమనే ♦ నీకట్లునల్పంగనో
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 47

మ. అరయంగానను వత్సరంబు శుభక ♦ ల్యాణోత్సవాదిప్రభల్
జరుగున్ జైత్రమునందునీకు బహుళా ♦ శావేశరాగంబులన్
దరినేయుండియు దర్శనంబునకు నే ♦ దాదవ్వులందుంటినో
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 48

మ. సురకార్యఘ్నులు, పాతకుల్ దనుజులీ ♦ సుల్ జెందఁగా బ్రహ్మయున్
హరియున్ వేల్పులుఁగాంచియత్నములబా ♦ హాటంబుగానల్పనా
పరశక్తిన్నియమించిదేవతల బ్రో ♦ వన్ జూచి తావేళనో
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 49

మ. గిరికన్యన్ వరియించికోర్కెలలరన్ ♦ గీర్తింపఁగాలోకముల్
పరిపాలించుచు నాదదంపతులనన్ ♦ వర్ధిల్లుటన్ బట్టియే,
శరణంబంచును, సజ్జనాళినిను, ని ♦ శ్శంకాత్మలన్ గొల్చెనో
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 50

మ. సిరియేవేళల విష్ణువక్షమున వా ♦ సించేరి తానొప్పఁగా
నరవిందాసను భార్యవాణిముఖమం ♦ దానందమున్ సల్పఁగా
దరహాసంబున నిచ్చియేలితివి య ♦ ర్థాంగంబునాదుర్గకున్
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 51

మ. వరదా! మెచ్చుటఁగాంచినన్ గిరిజనీ ♦ వామాంకమందొప్పెదుః-
దరుణీరత్నము దుర్గ! యేలః భవదు ♦ ద్యద్దక్షిణస్థానమం
దరయన్ నిల్చె సహేతుకంబు గనునా ♦ కర్థంబుగాఁదెల్పుమో
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 52

మ. గిరులందున్ రజతాద్రి; పుణ్యనదులం ♦ గీర్తింపఁగాగంగ; సా
గరసంఘంబున క్షీరవారినిధి! యుం ♦ గాంక్షించి కొల్వంగ, స
త్వరమే దర్శనమిచ్చుదైవముల దే ♦ వా! నీవె యెన్నంగనో
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 53

మ. గిరియందెచ్చటనుంటివో? యచటనీ ♦ గేహంబదెల్లుండునో?
యెఱుఁగన్ రాదుగదా! యటంచునినునే ♦ విప్పట్లఁ బ్రార్థించెదన్
దురితంబుల్ హరియించియేలుకొనుమా ♦ దుర్జ్ఞేయ! మృత్యుంజయా!
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 54

మ. పరదారాదుల మాతృదేవతలగా ♦ భావంబునం దెంచెదన్
బరద్రవ్యంబుల లోష్టనుంచెదను సం ♦ భావించి వర్తిల్లెదన్
బరభూతంబుల నాత్మతుల్యముగ నే ♦ భావించెదన్ ముక్తికై
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 55

మ. పరిశుద్ధంబు మనంబునంగనెద నీ ♦ పాదారవిందమ్ములం
ధరనీప్రాణము నిల్చునంతవఱకున్ ♦ దధ్యంబుగాఁగొల్తు, నే
మరణంబున్ గనలాభమేమి? పిదపన్ ♦ మన్నించినన్నేలుకో
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 56

మ. పరిశుద్ధంబు మనంబు లేనియెడలన్ ♦ బాపంబు కాదా? నిరం
తరమున్ వేదపురాణగోష్ఠిఁ గనినన్ ♦ ధర్మంబులన్ జేసినన్
జరితార్థంబెటులౌను! గాననినునే ♦ సన్ముక్తికై గోరితిన్
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 57

మ. గరుటామంతుని ధిక్కరించెగద! నా ♦ గంబొందు నీహారమై
ధరణిన్ మానవులెట్టి వేళనయినన్ ♦ దర్శించినీయాశ్రయం
బరయంగావలెఁ గానినీచులను దా ♦ మాశింపఁగాఁ జెల్లునా?
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 58

మ. సిరినీప్రజ్ఞ! యపర్ణభాగ్య! యచల ♦ శ్రీపుత్ర! వాసమ్ము, దు
ర్భరవిఘ్నాదులఁ బాపువాడనుతుఁడున్, ♦ బాపాపహారిమ్ము, సు
స్థిరముద్యోగముఁ గల్గుదేవుఁడవు! నీ ♦ సేవార్థుఁడన్నేను, మేల్
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 59

మ. హరియున్నీవును సేవ్యులీజగతినా ♦ హా! పుత్రభాగ్యంబునన్
స్థిరకీర్తిన్ విలసిల్లియొప్పితిరిగా! ♦ స్త్రీసంతతింగన్న చో
వరశుల్కంబుల నీయఁగావలసి, యే ♦ పాట్లొందనై యుందురో
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 60

మ. ధరదారిద్ర్యభరంబుదుస్సహము సం ♦ తానంబుపై పెచ్చు, హె
చ్చరయన్ స్త్రీతతిముఖ్యమై నెగడునా ♦ హా! పెండ్లి కార్యంబులన్
సరసంబొప్పఁగఁ జేయదుర్భరము నీ ♦ సాహాయ్యమే లేనిచో!
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 61

మ. నిరతంబున్ సుఖదుఃఖముల్ గలుగుఁబో ♦ నేపోవదీబుద్ధినీ
చరణాబ్జంబులఁగాంచిపూజసలుపన్ ♦ సాధ్యంబుఁగాకుండె; నే
లర? నాజన్మతరించి సౌఖ్యమునఁగా ♦ లంబీదఁగాఁగల్గునా?
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ! ♦ హారా! శివా! శంకరా! 62

మ. శరణంబంచును గొల్చుచుంటిననఘా! ♦ సాధింతునీదర్శనం
బారులేమార్గముఁజూపినన్ గనక య ♦ త్యుత్సాహమున్ జెంది, భా
సురవిజ్ఞానలతావితానములచే ♦ శుశ్రూష నేఁజేసెదన్
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 63

మ. స్థిరరూపీకృత పంచభూతమయమై ♦ శెల్వొందునీవిశ్వమున్
బరిపాలింతువు భూభరంబడపిదే ♦ వా! నీకునీవేగదా!
యొరులెవ్వారలు ధిక్కరింతురికనీ ♦ యుద్యోగమున్ మార్పఁగా
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 64

మ. మరణావస్థను బొందునప్పుడిఁక నే ♦ మాత్రంబునిన్ గొల్వఁగా
దరమా? నాకది, యెప్పుడేమగునొఁనా ♦ ధ్యానంబదెట్లుండునో?
నరకంబేఘటియించునో తుదకునా ♦ నాకంబె చేకూరునో?
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 65

మ. చరరూపాచర రూపమైపొలుచు వి ♦ శ్వంబెల్ల నెప్పంటిక
స్థిరమా, దానను నేఁడొ రేపొకదనా ♦ స్థిత్యంతవృద్ధిప్రభల్
బరలోకంబున నెట్టిపాట్లొదవునోఁ ♦ పాలింపఁగా గాగదే!
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 66

మ. తరమా! యేరికినైన నీమహిమలన్ ♦ దల్పంగనో దేవ! నేఁ
డరయన్ మానవునాయువేకొలఁదని ♦ త్యంబెద్దియో తత్త్వ భా
వరహస్యంబును గుర్తెఱుంగకయె సం ♦ భాషించినన్ బోవుతువా?
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 67

మ. ధరనాహార సుషుప్తిమృత్యువులనన్ ♦ దథ్యంబుగాజీవికిన్
వరరూపంబున నిర్ణయించెవిధిపెన్ ♦ బొట్లొందుచున్ గాలమున్
నెరపన్ జూతురు మానవాధములుఁలో ♦ నిన్నెంచఁగాఁబోక, యో
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 69

మ. అరిషడ్వర్గములన్నియున్ నిజము ని ♦ త్యంబెద్దియో? గానకే
దురవస్థాన్వితుఁగానొనర్చి యశమున్ ♦ దూలించుజీవాత్మకున్
బరమాత్మైక్యవిశేషముల్ దెలుపరా ♦ వాఁ జ్ఞానమార్గంబునన్
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 69

మ. కొఱగానట్టిపనుల్ ద్విజన్ములిల సం ♦ కోచింపకేచేతురే!
క్షురకర్మంబన దూరయానమనినన్ ♦ క్షుద్రుండుఁదానైతమున్
బరిశీలించును, మంచిచెడ్డలను నే ♦ ర్వన్ లేఁడు మూఢుండహా!
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 70

మ. పరువన్నన్ విడనాడఁ బోఁదొడఁగె సం ♦ భాషింప దుర్వాదముల్
పరిపాటింగనె శాస్త్రదూష్యమగు నీ ♦ పాల్గొంచనిందార్హమా;
వరదా! యెవ్విధిఁ బ్రోతువో? యిఁకను నీ ♦ భారంబ విశ్వంభరా!
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 71

మ. అరయన్మండలనాయకుండవుగదా! ♦ యన్యాయ్యమున్ జేతువా?
మరియాదన్ గనిచూడకన్న నినున ♦ మ్మంజాల నెప్పట్లునన్
భరమై తోఁచిన నేరిఁ గొల్చుటకు నే ♦ వారెట్టులాసింతురో!
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 72

మ. కురులే యందము కాంతలందఱకు షో ♦ కుల్ దీర్పఁ బుష్పాళితోఁ
గరులే యందము రాజమండలికి భో ♦ గంబందు వర్తిల్లఁగా
గిరులే యందము భక్తకోటికిలలోఁ ♦ గ్రీడించి సేవించఁగా
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 73

మ. సిరిసంపత్తులుఁ గల్గ నెల్లరు నినున్ ♦ సేవించనేమిచ్చెదో?
యెఱుఁగన్ జాల, కపాలమున్ గొనుచు నీ ♦ యిష్టానుసారంబునన్
దిరిపెంబున్ గనుచుందువయ్య! శరణా ♦ ర్థిన్ గావఁజాగేల? రా
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 74

మ. గురుశుశ్రూషయు సంగ నేనెఱుఁగ జం ♦ కున్ వీడి నిన్ గొల్చితిన్
త్వరితం బేననుబ్రోవవేడెద మహా ♦ త్సాహంబునన్ వేగనా
కరమందున్న కలంబు వ్రాసెనివిగో! ♦ గైకొమ్మ పద్యంబులన్
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 75

మ. అరుణుండున్ శశియున్ యథావిధిగ ని ♦ త్యంబీధరామండలిన్
బరిపాలించెదు లోకపాలురనఁగాఁ ♦ బ్రావీణ్యముం జెందరా
సరిపోలంగల వారు వారగుదురే ♦ చాయన్ నినుం బోలఁగా
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 76

మ. నరజన్మంబునఁజేసినట్టి దోసఁగుల్ ♦ నాశంబుఁ జేయంగ నె
వ్వరివేఁడన్ ఫలమేమి? పామరుఁడనా ♦ పాపంబులన్ వేగమే
హరియింపందగు నీశ్వరుండవని ని ♦ న్నత్యంతమున్ గొల్చెదన్
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 77

మ. భరమంచెంచక పాపపుణ్యమనకే ♦ ప్రాక్కర్మమూలంబునన్
జరియించున్ మది జ్ఞానమేదుచును నీ ♦ శా! గుర్తుతో నేనిఁకన్
సరిగా బుద్ధి మరల్పఁజూచుకొని నీ ♦ సాయుజ్యమున్ గాంతునో
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 78

మ. పొరనేఁగాశికిఁబోవఁజాల ననఘా! ♦ పుణ్యార్థ మెగంగలో
నెఱుఁగన్ జాలను మున్గనిశ్చయముగా ♦ నేనాఁటికిన్ గాని, నిన్
బరమార్థంబున నెంచివేఁడెదను నా ♦ పాపంబులన్ బాపుమా
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 79

మ. కరుణన్ జూడుము, యోగమున్న యెడగం ♦ గన్ గాంతు లేకున్న వే
గిరమున్ జెందక నా ఫలంబెకనుదున్ ♦ గృష్ణానదీ స్నానమే
శరణంబంచును జేసినీచరణముల్ ♦ సాధింపఁగా నెంచెదన్
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 80

మ. హరియాపాండవపక్షమూనియునిలో ♦ నత్యార్భటిన్ సల్పఁగాఁ
గురురాట్సైన్యము తెల్లఁబోరితుదకున్ ♦ గూలెన్ రణంబందునీ
శరమా పాశుపతాస్త్రమర్జునుని దో ♦ శ్శక్తిన్ నిరూపించెనో
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 81

మ. పొరపొచ్చెంబుల వీడికొల్చెదను సం ♦ పూర్ణంబుగాఁబ్రోవ స
త్వరమే దర్శనభాగ్యమబ్బు ఫలమున్ ♦ బ్రాప్తింపఁగాఁజేయుమా!
'కరణీకం' బొనరింపఁబోకు మనఘా! ♦ కాల్పట్టితిన్ రాగదే!
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 82

మ. హరికిన్నీకును భేదమేమి? కలద ♦ య్యా! యెంచిచూడంగని
ద్దఱునుద్యోగములందుఁ బూజ్యులిలలో ♦ దర్శింపఁగా నెల్లెడన్
గఱువన్ బాపెడు మూర్తిమంతులిఁకనా ♦ కష్టంబులీడేర్చఁగా
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హరా! శివా! శంకరా! 83

మ. పరమోత్సాహము పాపభంజనము స ♦ ర్వాతీతసాయుజ్యమున్
దురహంకార వినాశనంబు యశమున్ ♦ దోరంపుసద్భక్తియున్
వఱలున్ నిశ్చల మానసంబునను నీ ♦ పాదంబులన్ గొల్వఁగా
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హరా! శివా! శంకరా! 84

మ. మురళీగానవిలోలుఁడౌ హరియు స ♦ మ్మోదంబునన్ బ్రోవఁగా
దురితంబుల్ హరియించి కావఁగను మా ♦ ధుర్యంబుఁ జేకూర్పఁగా
నురుశక్తిన్ విలసిల్లి యొప్పెదరుగా ♦ 'ఓం'కారశబ్దంబునన్
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హరా! శివా! శంకరా! 85

మ. కరుణానందమయుండ! నిస్తులగుణా ♦ కారుండ! గౌరీమనో
హర పూజ్యుండ! విశేష భక్తజనపా ♦ లానందభాసుండ! సుం
దరవిజ్ఞానకరుండ! నీకడను నే ♦ దాసుండ చండీశ్వరా!
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హరా! శివా! శంకరా! 86

మ. కరుణాలంకృత శిష్టపోషక! విరా ♦ కారా! పరాధీశ్వరా!
గిరివాసాంచిత భోగిభూషణ! విరా ♦ గీ! ఫాలనేత్రా! పరా
త్పర! శంభూ! నినుగొల్తునేను వరదా! ♦ బ్రహ్మాదిసంసేవితా!
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హరా! శివా! శంకరా! 87

మ. పెరయూఁగల్ నవపుష్పరాజములపైఁ ♦ బేరాసతో వ్రాలుచున్
స్థిరచిత్తంబులతోడఁ దన్మధువు ని ♦ శ్శేషంబుగా గ్రోలున
ట్లురుభక్తిన్ భవదీయపాదములపై ♦ యోజించినే వ్రాలితిన్
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హరా! శివా! శంకరా! 88

మ. ధరలో దైవము లెందఱో గలరు వి ♦ స్తారంబుగా గొల్వఁగన్
బరమార్థంబున కొక్కురున్ నిజముగాఁ ♦ బాలింపఁగాఁ బోవ రే
కరణిన్ గొల్చిన లాభ మేమి? యని నీ ♦ కాల్వట్టితిన్ భక్తిమై
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 89

మ. నిరతానందమయుండవై జగతి నె ♦ న్నేరీతులం బర్తిలన్
దరమా? కొల్వఁగ నీదు భక్తుఁడను నీ ♦ దాక్షిణ్యపాత్రుండ స
త్వరమే మామక వాంఛలన్ నెఱపి సం ♦ బాళింపఁగా రాఁగదే!
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 90

మ. మఱ పేలా జనియించునో? నిదురలో ♦ మర్మంబ వెల్లుండునో?
మఱలన్ దెబ్బేటు లబ్బునో? గనఁగ సా ♦ మాన్యంబుగాఁ దోఁచదీ
కరణిన్ యోజనసేయ నిన్నెఱిఁగినేఁ ♦ గైవల్యమున్ గాంతునా?
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ! ♦ హారా! శివా! శంకరా! 91

మ. వఱలన్ జ్యోతి వెలుంగుచుండు నెడలన్ ♦ బ్రాణంబులాధారమై
పరఁగున్ దేహము కాంతిహీనమయినన్ ♦ భస్మంబు కాదా! కళే
బరమెన్నన్ క్షణభంగురంబుగను కన్ ♦ బ్రార్థింతు మున్ముందుగా
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 92

మ భరమా నన్నిటఁ బ్రోవ, నీకుఁ దగనా? ♦ ప్రార్థింపఁగా నేను, చె
చ్చెర నీపాదములంటి మ్రొక్కినను సం ♦ సిద్ధించు నాజన్మ మె
వ్వరు నేమన్నను నమ్మఁ జాలజగతిన్ ♦ బాపంబునన్ జిక్కితిన్
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా!93

మ. అరయన్ రాజులు భక్తిపూర్వకముగా ♦ నర్పింతు రెందేని స
త్వరమే కానుక లెన్నియేని, నిను సం ♦ దర్శింపఁగా బోవ భూ
సురుఁ డేమిచ్చును? నీకు భక్తిని వినా ♦ శుద్ధాంతరంగంబుతో
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 94

మ. స్థిరచిత్తంబున భక్తియుక్తముగఁ గా • శీయాత్రనేగడ్వఁగాఁ
దరమౌనా? నినుఁగొల్చుటేయరిది సం • దర్భానుసారంబుగా
మొఱయాలింపుమనందివాహనుఁడ! యే • న్యాయంచనంబోకుమా
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ • హారా! శివా! శంకరా! 95

మ. ధరలోఁబల్కుదు రెండుతోవివిధ సం • దర్భంబులన్ ముందుతా
మరయన్ జాలక మంచిచెడ్డలను నీ • వవ్వారినేమందువో?
యెఱుఁగన్ జాలను, శిష్టధర్మములు నా • కేలాలభించున్ వినన్
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ • హారా! శివా! శంకరా! 96

మ. హర! కర్కాటక లగ్నరాహుకుజర • వ్యామోద జాతుండనై
పఱలన్ జంద్రుఁడు కేతువేడిఁటను, కుం • భంబందుమందుండునా
గురువన్నన్వ్యయమందుశుక్రబుధులున్ • గూడెన్ ద్వితీయంబునన్
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ • హారా! శివా! శంకరా! 97

మ. ఎఱుగన్ దెల్పితి నాదుజాతకమదే • యేమందునో దేవ! నా
కెఱుఁగన్ దెల్పుమనిన్నుఁగొల్చుటకునే • నేమార్గమున్ గాంతునో?
పరమార్థంబునుఁ గోరినాఁడవరదా! • పాలించి నన్నేలుకో,
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ • హారా! శివా! శంకరా! 98

మ. వరదా! పుట్టితిఁబండితాన్వయమునన్ • వర్థిల్లితిన్ నేనిటుల్
బరభాషాపరి సేవకుండనగుచున్ • బాల్యకర్మమూలంబునన్
శరణంబంటిని నన్నుఁగావుమిఁక నీ • శా! భక్తకల్పద్రుమా!
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ • హారా! శివా! శంకరా! 99

మ. దురవస్థల్ ఘటియింపకుండఁగను ప్ర • త్యూషంబునిన్ గొల్వఁగా
స్థిరచిత్తంబును జ్ఞానమార్గమును సు • శ్రేయంబులున్ గల్గఁగా
వరముల్ కోరితిఁ జిత్తశుద్ధిగను నీ • పాదంబులేసాక్షిగా
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ • హారా! శివా! శంకరా! 100

మ. చిరకాలంబున నున్నకోర్కె మదిలో ♦ సేవించు టేతప్ప నిం
కెఱుఁగన్ నీపయిఁగల్గు భక్తియుటు నా ♦ యిష్టానుసారంబునన్
విరచింపంగనొనర్చె నీశతకముల్ ♦ వేవేగ నాచేతనో
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హరా! శివా! శంకరా! 101

మ. వెరపున్ జెందితిముందుగా నెటుల నీ ♦ వృత్తంబులోవ్రాయఁగన్
దరమౌనా యని నీకృపాతిశయమే ♦ తథ్యంబుగానివ్విధిన్
వెఱఁగున్ గొల్పఁగఁబూర్తిఁజేసినదిని ♦ ర్వృత్తిన్ గనంజాలుదున్
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హరా! శివా! శంకరా! 102

మ. ధరలోఁ బుట్టినదెందుకో? మనుజక ♦ ర్తవ్యంబు లెట్లుండునో
పరిశీలించి, నిజంబుఁగాంచియశమున్ ♦ బ్రాపించుటల్ వీడి, యీ
కరణిన్ గాలమువ్యర్థపుచ్చితిని, శ్రీ ♦ కంఠా! ననుంబ్రోవుమా
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హరా! శివా! శంకరా! 103

మ. కరముల్ గల్గిన లాభమేమి! నినుస ♦ త్కారుణ్య సంపత్తిచేఁ
బరమార్థంబునుఁగాంచి పూజఁగనఁగా ♦ భావ్యంబుగాకున్నసం
కరతన్ జెందుటతథ్యమయ్యె! యెటునీ ♦ కైవల్యమున్ గాంచుటల్
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హరా! శివా! శంకరా! 104

మ. హరిదాసాది కవీంద్రగాయకులు ని ♦ త్యంబున్ విశేషంబుగా
స్మరణన్ జేయుచునుందురయ్యె! నినుస ♦ న్మానంబులన్ బొందుచున్
బరమాహ్లాదముఁ జెందితిన్ గనుమ! యీ ♦ భక్తుండునీభక్తుఁడే!
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హరా! శివా! శంకరా! 105

మ. స్థిరభావాబ్దను మాఘమాస శివరాత్రిన్ ♦ భానువాసరంబునన్
బరమానందముతో నొసంగితిని నీ ♦ పాదంబులన్ నమ్మి వే
గిరమే నాశతకంబుఁగైకొనుము, శం ♦ కింపంగనీకేల? యో
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హరా! శివా! శంకరా! 106

మ. ధరణిన్ జ్యోస్యుల వంశపావనుఁడు సీ ♦ తారామ శ్రీరామల
క్ష్ముల్యరుపుత్రుండుత్వదీయదాసుఁడు కవి ♦ తోద్వాభ్యుసుఁడివ్వీని నే
మరకుండన్ గృపఁజూడుమా!సుగుణ నా♦మా!సూర్యనారాయణున్
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 107

— ♦ ఫలశ్రుతి ♦ —

మ. పరమేశా! యెవఁడైన భక్తపరుడై ♦ భావంబునం గొల్చినీ
చరితంబౌ శతకంబునుంజదువఁగా ♦ సౌభాగ్యసంపన్నుఁడై
స్థిరకీర్తిఁగని మోక్షమొందుఁదుదకుఁ ♦ శ్రీకంఠ! సర్వేశ్వరా!
హర! దుర్గాగణపేశ్వరా! ఫణిమణీ ♦ హారా! శివా! శంకరా! 108

గద్య,

శ్రీ సీతారామచంద్ర వరప్రసాద లబ్ధ కవితాసక్త శ్రీ మదాపస్తంబ
సూత్ర, కాశ్యపసగోత్ర, సాహితీవైభవ జ్యోస్యుల సీతారామ
శాస్త్రి తనూభవ సుకవిజన విధేయ సూర్యనారాయణ
శాస్త్రి నామధేయప్రణీతంబైన 'శ్రీదుర్గాగణపేశ్వరశతకం'
సంపూర్ణము.



## కనకదుర్గావిలాసము.

కల్పిత ప్రబంధ రాజము, త్వరలో వెలువడును.

అడ్రసు:—

జోస్యుల సూర్యనారాయణశాస్త్రి.

కోఆపరేటివ్ సూపర్వైజర్,

నూజవీడు, కృష్ణాజిల్లా.